Reg. No. 757

# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జనపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రకటింపఁబడుచున్నది.

గుంటూరు.


| సంపుటము | 1940 సం॥ జూన్ నెల | సంచిక |
|---|---|---|
| 32 | | 3 |


విషయములు






చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | 10 0 0 | చందాదారులకు | రు 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# రాజపోషకులు.

శ్రీమంతు, రాణి ఆదిలక్ష్మీదేవమ్మ బహాదరుగారు,
గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీశ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకర భారతీస్వాములవారు,
హంపి.

౨ శ్రీశ్రీ జగద్గురు, అభినవోద్దండ విద్యానృసింహాభారతీ
స్వాములవారు, పుష్పగిరి.

౩ తంగెడ నరసింహారావుగారు, కరణము, మోర్జంపాడు.

౪ ఆర్. రామారెడ్డిగారు, దైవముదిన్నె.

౫ రాజా సురభి వెంకటరత్నాంబ బహాదరుగారు,
రాణి, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురము.

౬ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౭ రాజా రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

౮ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

## పో ష కు లు.

౧ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు
జమీందారుగారు - దేవిడి

౩ రాయప్రోలు రాఘవదీక్షితులుగారు, పోలీసు సర్కిలిన్స్పెక్టరు,
గూడూరు

౪ తాండ్ర వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, బసవాపురము.

౫ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇసునూరు.

# చందాదారులు




1 దేవలపల్లి రామకిషన్‌రావుగారు - వంగపాడు
2 తూము రంగయ్యగారు, వకీలు - వరంగల్లు
3 ఏలూరు మాణిక్యరావుగారు - గవిచెర్ల
4 ఆమంచి అనంతరామయ్యగారు - మద్దిరాల
5 గొబ్బూరి గోపాలకృష్ణయ్యగారు - ఎఱ్ఱపాడు
6 జలగం మల్లయ్యగారు - ఎఱ్ఱపాడు
7 ఇటికాల రాజేశ్వరరావుగారు, వకీలు - కంభంమెట్టు
8 వెలమకన్ని లక్ష్మీనారాయణశాస్త్రిగారు - శోభనాద్రిగూడెం
9 ఆర్ పుట్టప్పగారు, హెడ్డుక్యాషియరు, ఇంపీరియల్ బ్యాంకి ఆఫీసు - ఆదోని
10 పెద్దిభట్ల వీరయ్యగారు, వకీలు - బెజవాడ
11 పుల్చి రామయ్యగారు - పెరికెలపూడి
12 గొడుగుల నారాయణమూర్తిగారు - కొప్పర్తి
13 మంచికంటి వెంకటరామయ్యగారు, కంట్రాక్టరు - నర్సారావుపేట
14 శ్రీరామకవచం అనంతశాస్త్రిగారు, స్కూలుపండిట్ - మిరియాలగూడెం
15 కురుగంటి సీతారామయ్యగారు, ప్రొఫెసరు, నైజాంకాలేజి - హైదరాబాదు
16 పెనుమర్తి యజ్ఞనారాయణరావుగారు, స్కూలుమాష్టరు - హైదరాబాదు
17 వేలేటి రాఘవశాస్త్రిగారు, టీచరు - హైదరాబాదు
18 నీలా నరసయ్యగారు, మర్చెంటు - సికిందరాబాదు
19 కొండంభట్లగారి వెంకన్నగారు - గుమ్మడిదల
20 తడిసిన గోపాలరెడ్డిదేశాయిగారు - దొంతి
21 తిరుమలరావుగారు, కరణం - దేమె
22 సీతారామారావు దేశముఖుగారు - జాలిగామ
23 గురువుల విశ్వనాథముగారు - దొమ్మాట
24 ఉప్పల రంగారావుగారు - కొడూరు
25 ఇరుకుళ్ల వెంకయ్యగారు, మర్చెంటు - సిరిసిళ్ళ
26 వకీలు శంకరరావుగారు - మాచారెడ్డిపేట
27 మొసలి పాపిరెడ్డి మొకద్దంగారు - కొమ్మేపల్లి

28 బీరవోలు రామచంద్రా రెడ్డిదొరవారు - వెంకటరావుపల్లె
29 సముద్రాల నరసింహాచార్యులుగారు - ఆత్మకూరు
30 దేవర్శాజు జనార్దనరావుగారు - ఆత్మకూరు
31 రావుసాహేబు దేవర్శాజు వీరభద్రరావు దేశాయిగారు - ఆత్మకూరు
32 కొత్వాలి కిషన్‌రావు దేశముఖుగారు - ఉప్పరపల్లి
33 లింగాల బండా రెడ్డి దేశముఖుగారు - నారాయణపురం
34 రంగరాజు రంగారావుగారు, పట్వారి - కోదూరు
35 నారాయణ రెడ్డి దేశముఖుగారు - చినమదూరు
36 బలుసు బుచ్చిసర్వారాయుడుబహదరుజమీందారుగారు - కపిలేశ్వరపురం
37 పోతురెడ్డిపల్లె వెంకటరామావధానిగారు - గుంటూరు
38 పెద్దిభట్ల కృష్ణమూర్తిగారు - గుంటూరు
39 పాలపర్తి రామబ్రహ్మంగారు ఆయల్‌కంపెని - బెజవాడ
40 తంగెడ నారాయణరావుగారు, కరణం - తంగెడ
41 ద్రోణా సోమయ్యగారు - సర్వవరం
42 వాజపేయయాజుల రామసుబ్బారాయుడుబియేగారు-కొల్లాపురము
43 రామప్పదొరవారు - వాడేల
44 నారాయణ రెడ్డి దేశముఖుగారు - మొలుగు
45 మల్లాది సత్యనారాయణగారు, వోవర్‌సీర్ - హైదరాబాదు
46 వంగపల్లి నీలకంఠంగారు - సికిందాబ్రాదు
47 నరసారెడ్డిగారు - నాచారము
48 కే. నరహరిగారు, ఆయుర్వేది - నంగునూరు
49 సుద్దాల లక్ష్మారావుగారు, కరణం - బొందుగుల
50 బోయనపల్లి నరసింగరావుగారు - చిత్తలూరు
51 తిరుకోవళ్ళూరు చక్రపాణిగారు, డిష్ట్రీతహశ్శీలుదారు - చీరాల
52 వ్యాకరణం వెంకటేశ్వరసిద్ధాంతిగారు - తాళ్ళూరు
53 జాజాల శ్రీనివాసశాస్త్రిగారు - హాలర్వి
54 యస్. వి. అప్పళాచార్యులుగారు - వనపర్తి
55 వెంకటరామారెడ్డిగారు - పార్లపల్లి
56 చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు - గుడివాడ

# అభినవసరస్వతి


| సంపుటము | విక్రమ నామసంవత్సరము | సంచిక |
|---|---|---|
| 3౨ | జ్యేష్ఠమాసము | 3 |


## ... సనాతన ధర్మ...ము

(శ్రీజగద్గురు...గోవర్ధన పీఠాధీశ్వరు...లు)

ధర్మము...పరలోకమునకు సంబంధించినదే కాక యిహలోకమందలి ప్రాణుల కందఱకును సంబంధించి శ్రేయస్సును గూర్చునది...ధర్మములలోని కెల్ల సనాతనధర్మము త్తమ ... ము ... దేశోన్నతికి సనాతనధర్మమే మూలకంద ... ము ... దేశ శాంతిని జేకూర్చుట కీధర్మమే ప్రధానసాధన ... ము ... విదేశీయులకును జక్కని యాతిథ్య మొసంగి గౌరవించునది సనాతనధర్మముగల భరతఖండమే ... ఈధర్మమును నిరోధించువారు హిందువులైనను హింద్వేతరులైనను దూష్యు లగుదు ... రు ... స్వదేశ వేషభాషాధర్మములందు భయభక్తులు గలవాఁడే హిందువుఁ డగు ... బైబిలు ఖురానుషరీఫ్ మున్నగు మతగ్రంథములలోని విషయములును సనాతనధర్మాంతర్భూతంబులే ... పాశ్చాత్త్యులు తమ కార్యములకు గౌరవము సంపాదించుకొనఁదలఁచి సైన్సను పేరుతోఁ గువాదములను జేయుచు మన ధర్మముపై నిర్మూల ... దోషముల నారోపించుచు యువకుల ... విభ్రాంతిపఱచుచున్నారు. మన ధర్మపద్ధతులలో స్వాతంత్ర్య విచారము లేదు ... అని పిచ్చిపట్టించినారు ... ఆజ్ఞాపింపుమనిన యర్జునునిగూడ శ్రీకృష్ణపరమాత్మ యాజ్ఞాపింపక శాస్త్రసృష్టి ... బోధించి నీకు మంచిదని తోఁచినట్లు చేయుమని చెప్పినట్లు గీతయందుఁ గలదు ... తామిదమిత్థమని విచారింపలేక గ్రుడ్డితనముతోఁ బోవువారి ననుకరించిపోవుట గ్రుడ్డితనముకాని వేఱొక గ్రుడ్డితనము లేదు. స్వబంధములను భేదించునదియే మోక్షమని శాస్త్రము చెప్పిన దెఱుఁగక గొఱ్ఱెలవలెఁ బరుల ననుకరించుటచేత శాంతిపుష్టికరమగు ధర్మము బలహీనమగుచున్నది. ధర్మ మెప్పుడును నేవిషయమునను నెవరికిని నపకారము చేయదు. అపకారము చేసిన చోట్లు కొందఱు చూపెదరుకాని కండ్లు తెఱచిచూచిన నక్కడ ... కొంటెతనము చేయఁబడినదనియు ధర్మమును త్రికరణశుద్ధిగ నమ్మి ప్రవర్తింపలేదనియుఁ జక్కగ నెఱుఁగఁగలము ... పరధర్మములు కొన్ని మనధర్మమునకు వ్యతిరేకముగ నున్నపుడెవ్వరిధర్మమును వారు సంప్రదాయము ననుసరించి యనుష్ఠించుచు భిన్నరుచులుగల సోదరులవలె ద్వేషము లేక ప్రవర్తింపవలెను ... ప్రజలలో నంతఃకలహములు లేకుండ శాంతినిగూర్చి ప్రపంచమును ధరించునది ధర్మము. "ధారణాత్ ధర్మః" అని ధర్మశబ్దమున కర్థము నిర్వచింపఁబడినది. ధర్మ మీలోకమున శాంతినిగూర్చుటయే కాక లోకేతరమున నుత్తమగతులను గల్పించుటచే లోకద్వయమునకును బ్రాణభూతము.

అట్టిధర్మము లన్నిమతములకును నొక్కటియే. దాని స్వరూపమును జక్కఁగా గమనింపనందుననే మతకలహములు బయలుదేరుచున్నవి. ఏమతమున నితరమతస్థులను పీడించుట ధర్మమని నిరూపించఁబడలేదు.

శ్లో. యో బాధతేఽన్యధర్మాంస్తు న స ధర్మస్తు కథ్యతే,
అవిరోధీతు యో ధర్మ స్స ధర్మ ఇతి నిశ్చయః.

... ఇట్టి యితరమతసహనము హిందూమతమునకుఁ బ్రాణభూతము. ఇట్టిధర్మము కొఱకుఁ బ్రాణమిత్తుననువాఁడే ధార్మికుఁడు. ఇతరమతముల ధ్వంసము చేయుట పాపము. అనేకమతస్థు లితరమతస్థులను దమమతమునఁ జేరుఁడని ప్రచారము చేయుచున్నారు. వా రితరమతములకంటెఁ దమమతమునకున్న విశేషమును ఋజువుచేసినచో నేనును నట్టి మతమునఁ జేరుటకు సంసిద్ధుఁడను. ఇతరమతస్వరూపమును గుర్తింపక తనమతమునఁ జేరుఁడని ప్రచారము చేయుట యర్థహీనము. ఇతరమతములను దనమతముతోఁ బోల్చిచూచి విమర్శించినవాఁడుకాని సత్యము గోచరింపదు. బౌద్ధధర్మమున నహింస బోధింపఁబడినది. అది హిందూమతమున లేకపోలేదు. యజ్ఞమునఁ బశుహింస హింసగా వేదమునఁ బరిగణింపఁబడలేదు. హింసాహింసల నిర్ణయము చేయుట యన్నియెడలను మనుష్యులకు సాధ్యముకాదు. ... యజ్ఞమునఁ బశుహింస నింద్యముకాదు. లోకక్షేమమును గోరి యజ్ఞములు చేయఁబడుచున్నవి ... మతకలహము ... రాజ్యాభిలాష కారణముకాని మతకారణము కాదు. యూరపుదేశమున మతకలహములు రాజ్యాసక్తిని ... బయలుదేఱినవి. క్రైస్తవమతగ్రంథమున న్యూటెస్టుమెంటనియు నోల్డుటెస్టుమెంటనియు రెండుభాగములున్నవి. క్రీస్తు పూర్వము ధర్మమునే యాచరణకుఁదెచ్చి మతసంస్కర్తయై గౌరవము పొందినాఁడు. అటులనే మహమ్మదుకూడ ... అప్పటి నుండియు నామతముల కాప్రవక్తలనుబట్టి యానామములు వచ్చినవి. ఆప్రవక్తలను భగవత్పుత్రులని వారందురు. హిందువు లట్టి రామకృష్ణాదుల నవతారపురుషు లందురు. దేశకాలాదిభేదములను జూచి డాక్టరు మందుల నిచ్చునట్లు ప్రవక్తలు మతములను నిర్మించినను సనాతనధర్మము లందఱకును సమానములే. కనుక మతాంతరమునఁ జేరువా రాయామతములను జక్కఁగా విమర్శించి ప్రవేశించవలెను. రుచిభేదములనుబట్టియే వివిధమతము లితరదేశములందును నేర్పడినట్లు ప్రొటెస్టెంటు రోమన్ కాథలిక్కు శాఖాభేదములనుబట్టి తేలుచున్నవి.

ప్రత్యక్షవిషయములలోనే మతభేదము లుండ నతీంద్రియములగు మతములలో సూక్ష్మభేదములుండుట తప్పుగాదు ... ఇతరమతములకుఁ బ్రవక్తనుండి ప్రారంభము కనఁబడుచున్నదికాని సనాతనమతమున కట్టిది లేదు. ఇది సృష్టినుండి యున్నది. అట్టి రక్షకుని శాసనమగు మతము నతిక్రమించుట పాపము. హిందూమతమున నితరమతముల యందు సహనముండఁబట్టియే సెంటుథామసు యూరపునుండి వెడలఁగొట్టఁబడి తిరువాన్కూరులో నిలువనీడ సంపాదించఁగలిగినాఁడు ... సనాతనమతావలంబకుఁ డితరమత ప్రవక్తలను గాని యితరమతస్థులను గాని దూషించక వారియందును భగవదంశకలదని విశ్వసించును ... పాశ్చాత్యులు మనధర్మమున దోషారోపణ చేయుటకు వివిధమైన పనులు చేసిరి. తమ మతగ్రంథమందున్న దోషములను దాచిపెట్టియు ... సమర్థించు

కొనియు మనగ్రంథములఁగలవానిని నిందించిరి. మోయర్ విలియమ్సు తన హిందు
మతగ్రంథమున దేవుని కన్నముఁబెట్టినిచో బ్రతుకలేఁడు కాఁబోలును. అట్టిదేవుఁ
వీరి కేమియుపకారము చేయఁగలఁడు ? " ఇత్యాదిహాస్యము చేయుచుఁ బోయిపోఁ
చిట్టచివర హిందువు లందఱు నొక్కసారి యొకగోజాన నేసుక్రీస్తుపేరు పెద్దపెట్టుఁ
దలఁపవలెనని వ్రాసెనఁట ... కుంతికిఁ గర్ణుఁడు కన్యగానున్నపు డెట్లుపుట్టెనంచు
మేరి కేసు పుట్టిన దెట్లు? ఇటువంటి పుట్టుకకుఁ బాశ్చాత్యవైద్యశాస్త్రమున పార్థోని
జెనిసినందురు. ఇటువంటిపుట్టుక లమెరికాయందు డాక్టరులు స్వయముగఁజూచి పు
కలయందు వ్రాసిరి ... సైంధవుని జంపునపుడు భగవానులు చక్రముచే సూర్యునిగప్పి
విధమున జోషువా వధయునపుడు సూర్యు మున్నచోటనే స్తంభింపఁజేసినట్లు బైబి
లోఁ గలదు. కాళిదాసు గ్రంథములం దంతట నొక్కశైలి కనఁబడనందున నవి యొక్క
కవి వ్రాసినవి కావందురు. షేక్స్పియరుగ్రంథములు నానావిధములశైలి గలిగినను
వాని నొక్కకవినని సమర్థింతురు. రాసలీల భగవానులు 11 సం॥ల వయసులోఁ జేసి
... గోపికలు వట్టి భక్తిచేసినట్లును నది దేహసంబంధమైన పనిగాక కేవల మాత్మ
సంబంధమైనదనియు విశదముగ ... వివరింపఁబడినది. అయినను దీనిని వ్యభిచారము
యెల్లిచేయుచున్నారు. బైబిలులో సాంగాఫ్ సాలోమనులో నెట్టిసందర్భమునఁ బిచ్చివ్రా
తలు చేయఁబడియున్నవో వానిని జూడకొనెదరు. స్కాటుద్ధతి నెలకొల్పి మనదే
మునఁ బరోపకారముచేయుట నేర్పితి మనుచున్నారు. 5 వేల యేండ్లక్రింద వ్రాయ
బడిన భగవద్గీతల ముఖ్యతత్త్వము నిష్కామకర్మమని తెలిసికొనలేని మనవారిని వారి
సులభముగ మోసపుచ్చఁజూచుచున్నారు.

కంసుని జంపి యాతని కుమారునకే రాజ్యమిచ్చెను. జరాసంధుని వధింపి
యతనికుమారుని రాజ్యమునం దుంచెను. కాని శ్రీకృష్ణుఁ డెవరిరాజ్యమును సమర్థుఁడయ్యు
నపహరింపలేదు. మన ... ధర్మము న్యాయమే కాని పక్షపాతము స్వలాభముఁ గాదు
రాక్షసజాతిబాలకుఁడగు ప్రహ్లాదుని రక్షించుటకు నృసింహావతారమునెత్తె శ్రీమహావిష్ణువు
గుణమే ప్రధానముగాఁ జూచియే మనధర్మము ప్రవర్తించినది ... కేవలము శాంతి
నెలకొల్పునది. పాశ్చాత్యనాగరకతయన్ననో రాజునకు రైతుకు యజమానునకు గాక
తండ్రికిఁ గొడుకునకుఁ జివరకు మగనికిఁ బెండ్లామునకుఁ దగాదాగలిగించి పగపెంచు
నది. అందువలననే వారిలో వివాహములసంఖ్యతో విడాకుల సంఖ్యయు సమముగా
నుండును ... సంపూర్ణముగ సమస్తబంధములనుండి తప్పించి శాశ్వతసుఖమును బొందు
టయే శాస్త్రముయొక్క ముఖ్యోద్దేశము గాని యెల్లకాలము నొకరితో నొకరు కొట్లా
డుట కాదు. కొట్లాటయంతయుఁ బాశ్చాత్యదేశాగతము ... పాశ్చాత్యశిక్ష యలవడి
నందుననే యిట్లు సంభవించె ... మనగ్రంథములను సమగ్రముగాఁ జూచి మాటలాడ
వలె ...

## —♦ శాస్త్రబద్ధులగు చాతుర్వర్ణ్యమహాజనులకు హితప్రబోధనము ♦—

(మల్లాది రామకృష్ణవిద్వచ్ఛయనులుగారు)
(అఖిలభారతవర్షీయ వర్ణాశ్రమస్వరాజ్యసంఘ పండితపరిషదుపాధ్యక్షులు)
(శ్రీజగద్గురు పుష్పగిరిసంస్థాన ప్రధానపండితులు)

ఆర్యులారా !

మనము నివసించెడి భరతఖండము భూమండలమున నన్నిఖండములకంటెను పవిత్రమైనదనియు నిహలోకభోగములకంటెం బారలౌకికసుఖమును మోక్షమును హెచ్చుగాం భావించెడి చాతుర్వర్ణ్యప్రజలతో నిండియుండినదనియు ననేకపురాణములలో ... వర్ణింపఁబడియున్నది. అట్టి ధర్మప్రధానులైన పూర్వపురుషుల వంశములకు సంబంధించినవారలమే మనము. ఈభరతఖండమునకు సుమారు ౨ వేల సం॥ నుండి విదేశీయుల దండయాత్రలు వారి పరిపాలనమునకు, వారి నిరంకుశప్రవర్తనమునకు లోఁబడియుండుటయుఁ గలికాలవశమున సంభవించియున్నసంగతి చరిత్రవిదులకుఁ దెలియనిదికాదు. అట్టియిక్కట్లసమయమందునను మనపూర్వులు ప్రాణములను స్థిరచరములగు నాస్తులను నైహికసుఖములను గోల్పోయియుఁ బ్రాణములకంటె నధికప్రియమైనట్టియు నుత్తరజన్మములలోఁ దమకు సత్యుత్తమపదము నొసంగునని నమ్మినదియు నైనధర్మమును యావచ్ఛక్తిని గాపాడుకొనియే వచ్చిరి. నేఁటికాలమున రాజనీతికౌశలముచే మనప్రజలు భోగతృష్ణచేతను జీవికాప్రత్యాశచేతను రాజకీయోన్నతోద్యోగముల సంపాదించెదమను నాశచేతను వశపఱచుకోఁబడి విదేశ విద్యావ్యాసంగములం దాఁటితేరిరి. విదేశీయులు మనమతము నిష్ప్రమాణమనియు మనచేఁ బ్రమాణములని నమ్మఁబడెడి గ్రంథములు కట్టుకథలనియు మనమే యితర ఖండమునుంచియో వలసవచ్చితిమనియు నీఖండపుఁ బ్రజ లందఱుఁ బంచములే యనియు నాబాల్యముఁ బాఠశాలలయందును దదితరస్థలములందును బోధింపసాగిరి. క్రమముగా నాబోధ తలకెక్కినకొలఁది వీరి చిత్తవృత్తులు మాఱినవి. వీరలే యున్నతోద్యోగులు దేశనాయకులు నై ప్రవర్తకు లగుచున్నారు. దీనిమూలమున మనవంశములలో జన్మించినవారలే ప్రతిగృహమందును మనమతమునకుఁ బ్రబలశత్రువు లగుచున్నారు. ఇట్టి మహావిప్లవసమయమున ననాదికాలమునుండి మన పూర్వపురుషులచేఁ బ్రాణాధికముగఁ గాపాడఁబడిన స్వధర్మమును రక్షించుకొనుటకంటె మనము చేయఁదగిన మఱియొక పుణ్యకార్యము లేదనిన నతిశయోక్తి కాదు. ఈనవనాగరికుల వాద మంతయు నసత్యము.

శ్లో. "అనాదినిధనా నిత్యా వా గుత్సృష్టా స్వయంభువా
ఆదౌ వేదమయీ దివ్యా యత స్సర్వాః ప్రవృత్తయః."

ఇత్యాది ప్రమాణములు వేదములు దేవునివలె ననాదులని చెప్పుచున్నవి. వాని

నుల్లంఘించుట నిర్యుక్తికము. ఆర్యావర్తమనియు బ్రహ్మర్షి దేశమనియు ఖ్యాతిగాంచిన మన పుణ్యభూమి యార్యులగు మనపూర్వపురుషులకు జన్మస్థానము కాని యెక్కడనుంచియో వచ్చినవారిచే నాక్రమింపఁబడినది కాదు ఆర్యావర్తమను పదమే యాయర్థమును జెప్పును. మానవజాతికి సృష్టికర్తయగు మనువు నాయనకుమారులగు ప్రియవ్రతోత్తానపాదులు నార్యావర్తమం దవతరించినట్లు పురాణవచనములు గలవు. అనేక లక్షల సం॥ లకు లోఁగా నీఖండమును బరిపాలించిన శ్రీరామచంద్రాదులచేఁ బ్రతిష్ఠింపఁబడిన రామనాథస్వామివారు మొదలగు దేవతల యాలయములు యాత్రాస్థానములుగా నేఁటికిని బ్రసిద్ధములైయున్నవి. ఇట్టిపూర్వచరిత్రములను జెప్పెడి రామాయణభారతాదిగ్రంథములు పారాయణగ్రంథములుగా మనపూర్వులచే నంగీకరింపఁబడుచున్నవి. అట్టిగ్రంథముల నప్రమాణములని భావించి 500 సం॥ లకు లోఁగా నీభరతఖండము వార్తనే గుఱుతెఱుఁగనట్టియు వీరి ఘనతను సహించనట్టియు విదేశీయుల వాక్యముల విని మోసపోవుట పొరపాటు.

మనగ్రంథములందు 'రౌరవంతు రజస్వలాం' అనియు.

శ్లో. "పితుర్గేహేతు యా కన్యా రజః పశ్య త్యసంస్కృతా
సా కన్యా వృషలీ జ్ఞేయా తత్పతి ర్వృషలీపతిః."

అనియు నిత్యాదివచనములు రజోదర్శనానంతరవివాహము మనను గులభ్రష్టులఁ జేయుననియు మన పితృదేవతలకు నరకమునిచ్చుననియుఁ జెప్పుచున్నవి. ఆశాస్త్రములను నమ్మియే మన యావద్వ్యవహారము జరుగుచున్నది. మనకుఁ బరలోకసాధనమగు ధర్మము చెడినచో బ్రతికినను జచ్చినవారలవంటివార మగుదుము. కులము భ్రష్టమాయెనేని మరల వచ్చునదికాదు. పూర్వజన్మమందు నమ్మకములేని క్రైస్తవులు మహమ్మదీయులు వారునమ్మిన బైబిలు కురానులలో మన మాచరించెడి బాల్యవివాహవిధులు లేనందున రజోదర్శనానంతర వివాహములు నేసికొనినను వారిశాస్త్రమునకు విరోధములేదు. వారి మతగ్రంథములకంటె ననాదికాలమునుంచి ప్రమాణరాజములైవిరాజమానములగు వేదములందునను ధర్మశాస్త్రములందునను విధింపఁబడినట్టియుఁ బ్రౌఢావివాహమును జేసిన యెడలఁ జేసినవానికిని వాని పితృదేవతలకును నరకమువచ్చునని నిషేధింపఁబడినట్టియు రజోదర్శనానంతర వివాహములు మాకు సమ్మతములని యభిప్రాయమిచ్చి కులభ్రష్టులగుట మహాపాపకార్యము. ఆర్యసమాజీయులు హిందువులనుండి చీలిపోయినవారైనను మొదటినుండి పాశ్చాత్యవిద్యలనే చదివి తద్వాసనావాసితులైన దయానందులను నొక పురుషునిచే స్వబుద్ధికల్పనచే వేదములలోఁ గొంతభాగ మంగీకరించియుఁ గొంత విడనాడియు స్మృతులను బురాణములను నిరాకరించియుఁ దామంగీకరించిన వేదభాగముల కపార్థములఁ జెప్పియు నేగ్రంథములును నేపూర్వపురుషులును నంగీకరించని గుణకర్మములను బట్టియే జాతులు మాఱునను వాదము నంగీకరించుచుఁ దురకలనుగూడ హిందువులలోఁ జేర్చెదమనునపసిద్ధాంతము నవలంబించినవారలు గనుక వారును క్రైస్తవ మహమ్మదీయులతోపాటన్యమతస్థులే కాని మనసంఘములోనివారలు కారు. దేశక్షేమ

మునకు సంబంధించిన రాజకీయవిషయములలో మనము వారికిఁ దోడ్పడినఁ దోడ్పడ వచ్చును. కాని వారిధర్మధ్వంసకములైన సిద్ధాంతముల నంగీకరించి యనాదిసిద్ధములైన మన కులధర్మముల మంటఁగలుపుట పాపకార్యము.

శ్లో. "కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతమ్
బాంధవాః కుల మిచ్ఛన్తి మృష్టాన్న మితరే జనాః"

అను నభియుక్తోక్తి కలదు. 14 సం॥లకుఁ బైననే కన్యకకు వివాహము చేయుట శాసనమే యయినచో నాకన్యక ప్రౌఢయైనందున రూపమును మాత్రమే కోరినదై యన్యకులస్థుఁడైనను దరిద్రుఁడైనను గుణహీనుఁడైనను నట్టిరూపవంతుని వరించును. అటుపైని సర్వానర్థములకు భాజనమగును బాల్యవివాహము చేయునప్పుడు కన్య యొక్క భవిష్యత్కాలక్షేమము తల్లిదండ్రులకు విచారణీయము గనుక తల్లి ధనవంతుని గాను దండ్రి విద్యాధికునిగాను బాంధవులు కులీనత్వము విచారింతురు. వీరియందఱి సమ్మతిప్రకారము జరిగినవివాహము కన్యకు సకలకల్యాణముల నొసఁగును. బాల్యమందుఁ దలిదండ్రు లెవ్వనికిచ్చి వివాహ మాచరింతురో వానియందే యాకన్యకకుఁ బ్రేమలత వృద్ధిఁజెందును. ముదురుతీఁగ కల్లికపెట్టినను నది కొనసాగదు. కనుక నోసత్కులీనులారా! "సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ" అని లోకగురుండగు శ్రీకృష్ణ భగవానుఁ డానతిచ్చెను. ప్రౌఢావివాహముల మూలమున నాంగ్లేయులుపడు బాధలను బత్రికలు వేనోళ్ళఁ జాటుచున్నవి. ఈసంగతుల నన్నిటిని గ్రహించియు మన నీదుష్కార్యములలోఁ బ్రవర్తింపఁ జేయుటకై దేశనాయకంమన్యులు పురికొల్పుటకు వారివేదశాస్త్రముల నభ్యసించకపోవుటయు బాల్యము మొదలు విదేశీయాచారము లలవడుటయు వారి జన్మాంతరవాసనలును హేతువులు. అఖిలభారతవర్షీయవర్ణాశ్రమ స్వరాజ్యసంఘమువారి హితోపదేశ మింతకంటె వేఱు కాదు. శ్రీజగద్గురువులగు శ్రీశృంగగిరి శ్రీపుష్పగిరి శ్రీకామకోట్యాదిపీఠాధీశ్వరుల సదుపదేశ మింతకంటె వేఱు కాదు.

విశేషించి నిజాము రాష్ట్రీయులగు చాతుర్వర్ణ్యప్రజలు గమనించవలసిన ముఖ్యవిషయము. వెనుక చింతించుట వెఱ్ఱితనము. ఇప్పుడు ప్రజాభిప్రాయపరిజ్ఞానమునకుఁ బంపఁబడిన యీబాల్యవివాహనిషేధశాసనము బిల్లును యావచ్ఛక్తి ప్రతిఘటించి మహాజనముయొక్క యసమ్మతిని దెలియఁజేసి యిది శాసనము కాకుండఁజేసి ధర్మసంరక్షణసుకృతము నంది తమతమ వంశములు భ్రష్టములు కాకుండ రక్షించుకొందురుగాక. నేను బాల్యమున భాగ్యనగరమునందు స్వగృహేయని సంకల్పము చేసినవాఁడను. స్వదేశీయుఁడను, గనుక నీవిషయమును గమనించి ధర్మరక్షణమునకుఁ దోడ్పడుదురని నమ్ముచున్నవాఁడను. ధర్మో జయతు.

---

## తిరువాన్కూరుమహారాజు శిలాప్రతిష్ఠ

(చివుకుల అప్పయ్యశాస్త్రిగారు)

ఇటీవలఁ గొలఁదిదినములక్రిందట మదరాసు ... నఁ దిరువాన్కూరు మహారాజుగారి శిలావిగ్రహప్రతిష్ఠ జరిగినది. ఇది రాజుగారు పంచములకు దేవాలయప్రవేశము నిప్పించినందులకు జ్ఞాపకార్థముగ జరిపినారఁట. తొలుతనుండియు భరతఖండమున శివకేశవదేవీప్రభృతి దేవతలు సాధారణముగా నుండు నుపాసకుల కంటికిఁ గనఁబడనివారగుటచేఁ బూజించుటకు శాస్త్రమునందుఁ జెప్పఁబడినట్లు తత్తద్దేవతలకుఁ దత్తదాకారములను గల్పించి యథావిధిగాఁ బ్రతిష్ఠించెడి యాచార మున్నది. భక్తులీ విగ్రహారాధన మొనరించి క్రమముగా జ్ఞానముగలిగినమీఁద సచ్చిదానందుని మానసికముగా ధ్యానించి మోక్ష మందుచుండెడివారు ... తలిదండ్రులు మున్నగువారు మృతులైనపిమ్మట నుత్తరక్రియాదులం గావించుటకుఁగా నొక శిలయందుఁ దమ పితరుల యాకారమును గల్పించి యాదరించెడి శాస్త్రీయాచారమును గలదు ... మహాభక్తులై పిమ్మట జ్ఞానులై యమానుషకార్యములం జూపి మృతులైన మహాత్ములను మనవారు దేవతలనుగా భావించి జ్ఞాపకార్థముగా వారి యాకారములను నొకశిలయందుఁ బూర్తిగాఁ జిత్రించి పూజించెడివాడుకయుఁ గలదు ... ఏదో యొక ధార్మిక మహాకార్యమును జరిపినవారికి శిలాకార మొకటి నిర్మించి సముచితప్రదేశములను నిలిపెడి యలవాటును గలదు. ఇపుడీరాజశిలాప్రతిష్ఠ పై నాల్గింటిలో నెందునఁగూడఁ జేరదని తలంచుచున్నాము. ఈమహారాజుగారు చేసిన ధార్మికమహాకార్య మేమిగలదు? స్వాధీనమున నుండు దేవాలయములలో శ్రుతిస్మృతిసదాచారవిరుద్ధముగాఁ బంచములను నిరంకుశముగఁ బ్రవేశింపఁజేయుటయేనా? అందుల కెవరు సంతోషించిరి? ఎవరు భూషించిరి? బహుళసంఖ్యాకులును రాజుగారియందు భక్తివిశ్వాసములు గలవారును నగు సనాతనులు తమ రాజ్యములోనుండువారుసైత మానందింపకపోవుటయే కాక శాస్త్రీయానూచానాచారవిరుద్ధమని నిరసించి తద్దేవాలయములను బహిష్కరించిరి. ప్రభువులు సంతోషించిరందురా? ఇది ప్రతిష్ఠించిన శ్రీ గవర్నరుగారు మహారాజుగారి కృత్యము సర్వజనసమ్మతమును మెచ్చుకొనఁదగినదియుఁ గాకపోయినను నేఁటికిఁ గొంతవఱకు మాత్రమే రైనదని చెప్పి తప్పించుకొనిరి.

ఒకవేళ శ్రీవారు మెచ్చిరనియే యనుకొందము. వారు భారతీయ శాస్త్రీయధర్మాచారాదివిషయములు గుర్తెఱుఁగనివారగుటం బట్టి వారి మెప్పుదల యావిషయమం దంత విలువగలది గానేరదు. వారుగాక కొచ్చినుమహారాజు మున్నగు ధార్మిక ప్రభువు లెవరైన మెచ్చిరా? లేదు. దీనింబట్టి ప్రభువులును మెచ్చలేదని తేలినది. ఇఁకఁ బంచమోద్ధరణకై పాటుఁబడుచున్నామని డప్పుగొట్టి చెప్పుకొనుచు నిర్బంధశాసనంబులం గావించెడి కాంగ్రెసువారును దత్సభాసమావేశకులును దదుపన్యాసకులును మెచ్చిన మెచ్చవచ్చు. ఇందులకుఁ జిత్రపడవలసిన యవసరము గానరాదు. వీరి

సంఘశ్య ఒహాస్వల్పము. దాంక్షిక వ్యాచార వత్యధికము. పంచములు సంతోషింతు రం దురా ? వారికిఁ గావలసినవి యార్థికాదిసౌకర్యములైనందున నిందుల కానందింతురని తలంచుట వెఱ్ఱితనము. అంబేద్కరు ప్రభృతి నిమ్నజాతినాయకుల యుపన్యాసములే సాక్షి. ఎవరుసంతోషించినను నెవరు సంతోషింపకపోయినను సర్వభూతదయాపరుఁడగు సనాతనుఁడే సంతసించునందురా ? అది కలలోనివార్త. శాస్త్రవిధి నుల్లంఘించి స్వేచ్ఛగా సంచరించువాఁడు నాయాజ్ఞను ధిక్కరించువాఁడు ద్రోహియు సుఖహీనుఁడు నగునని—

శ్లో. యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిం,
ఆజ్ఞాచ్ఛేదీ మహాద్రోహీ. ... ...

మొదలగు గీతావాక్యములలో నొక్కి చెప్పియున్నాఁడు. కాఁబట్టి యింకను దీర్ఘాయుష్మంతుఁడై రాష్ట్రపరిపాలనము గావింపఁదగిన తిరువాన్కూరురాజాగారి విగ్రహమును శిలయందుఁ జెక్కించి ప్రతిష్ఠించుట యెంతమాత్రము బాగుగా లేదనియుఁ బైపెచ్చు మతధర్మాచారధ్వంసకకార్యములు గావించినాఁ డీమహారాజని యావిగ్రహమును జూచినప్పుడెల్ల ధార్మికజనులు నిందించెడి దశ యద్దానికిఁ బట్టునేమోయని యుఁ దోఁచుచున్నది. కానసే సంఘసంస్కారంమన్యులో యేకాంగ్రెసువారో యల్ప సంఖ్యాకులు సంతసించుట ప్రధానమని తలంచి యావిగ్రహము నట్లే యుంచుట భావ్యము గాదని సూచించుచున్నారము.

---

## —• ప్రస్తుతపు సారస్వతస్థితి •—

(విమర్శకాగ్రేసర కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిలుగారు)

భగవంతుఁడు ... 80 ఏండ్లు ... న న్నీభూమిపై నిలిపెను. నావయస్సు మిక్కిలి ముదిరిపోయినది. ఇంత ... వయస్సులో ననేకచిత్రములు జరిగియున్నవి. వానిని ... వ్రాయుచున్నాను ... నాకు సారస్వతమునం దభిరుచి మెండు. ఆ హేతువుచే దాని పరిశీలనము హెచ్చుగాఁ జేయఁగా మన సారస్వతములో విమర్శనములు చాల తక్కువగానున్నవనియు సారస్వతాభివృద్ధి చేయవలయునన్న విమర్శనము లెక్కువగాఁ జేయవలయుననియుఁ దోఁచినది. సంస్కృతమునందును నింగ్లీషునందును విమర్శనములు హెచ్చుగాఁ గలవు. అవిధముగానే తెలుఁగునందును

హెచ్చు చేయఁదలఁచి వ్రాయుటకుఁ బూనుకొంటిని. రాజశేఖరచరిత్రమును నవల ... విపరీతస్థితిలో నడచినందున లోకములో నిట్టిగ్రంథములు పుట్టిన సారస్వత మంతయుఁ బాడగునని ... విమర్శింపఁబూనితిని. ఈవిమర్శనము నా మొదటిగ్రంథము. ఇందులో ... గుణములకంటె దోషములు హెచ్చినందున ... ఖండన మెక్కువయైనది. అందుచే వీరేశలింగముగారికిని వారి శిష్యులకును నాపై ద్వేషము పెరిఁగి తిట్టఁబడితిని ... నేను దిట్టలేదు ... మరణాంతాని వైరాణి ... స్వర్గములో నున్నవారిమాట యిపు డెందులకనిన ... స్వర్గస్థులైనను మృతునిగా వారిని మనము తలంపరాదు. ... కవి ... కాఁబట్టి ... మృతజీవుఁడు. ... వీరేశలింగముగారు కొమఱ్ఱాజు లక్ష్మణ రావుగారు మున్నగువారు మొదట నావిమర్శనములఁ బాటింపకపోయినను బాగుగాఁ బరిశీలించిన తరువాత సరియైనవనియే యభిప్రాయపడఁజొచ్చిరి ... క్రమముగా నా విమర్శనముల నంగీకరింపఁజొచ్చిరి. నేను బరిశోధకులలో నొకఁడనైనట్లుగ... లక్ష్మణ రావుగారు చిత్రాదివ్యాసములో వ్రాసిరి... వీరేశలింగముగారును... చేయూఁతనీయ మొదలిడిరి. కవుల చరిత్రకారులు నన్నయభట్టుకంటె బూర్వము తెనుఁగుకావ్యములు చెప్పినకవులు పెక్కురు గలరనియు నందు భీమకవి కవిభల్లటుఁడు నన్నెచోడుఁడు మున్నగువార నేకు లు...ండెడివారనియుఁ జెప్పుచు వచ్చినవారే యైనను నా వ్రాఁతలు చూచి పరిశోధకుఁడేయని గ్రహించిన తరువాత ... నన్నయభట్టారకుఁడే మొదటి ... తెలుఁగుకవియని తలంప మొదలుపెట్టిరి. ... నావిమర్శనములను ద్రోసి వేయ ... లేదు. మఱియుఁ గవులచరిత్రకారుఁడు మంత్రిభాస్కరుఁడే భాస్కర రామాయణ మొనరించిన కవియని మొదట వ్రాసెను. దానిపై విమర్శించుచు నేను భాస్కరోదంతమను గ్రంథమును వ్రాసితిని. నాగ్రంథమును జూచినతరువాతఁ దన కవులచరిత్రములలో ... దిద్దివేసికొనెను. ఈవిధముగా నే నొకపరిశోధకుఁడనుగాఁ దీసికొనఁ బడితిని...విమర్శకాగ్రేసరబిరుదము నాకు విజయనగరపండితు లొసంగిరి. వారిలో బ్రహ్మశ్రీ ఆదిభట్ట నారాయణదాసుగారు మున్నగు పెద్దలు గలరు ... దానిని నేను బెద్దలయందలి గౌరవముచే వాడుకొనఁ జొచ్చితిని...కొందఱు ... విచారపడఁ జొచ్చిరి. దైవకృపచేత నీవిధముగా నా భాషాపరిజ్ఞానమునకు వన్నె రాఁజొచ్చినది ...శేకుమళ్ల రాజగోపాలరావుగారు... నన్నుఁగని మిత్రునితో...నీవు గొప్పవారిపై నొకవిమర్శనము వ్రాయుమనెను.అది యెందుకని ప్రశ్నింప వారిపేరుతోఁగూడ నీపేరు పైకివచ్చుననియె. ఆమాట విని నేను ... గొప్పవారిపై విమర్శనము వ్రాయుటచేత నే పేరువచ్చునా ? ఉత్తమవిమర్శన మైనప్పుడే పేరువచ్చునుగదాయని తలంచి విమర్శ నము లుండవలసిన మార్గముకూడఁ జూపితిని. సాహిత్యాభివృద్ధిని జేయునవి విమర్శన ములు భాషాంతరీకరణములు వ్యాఖ్యానములు నను మూఁడునునై యున్నవి. వీనిలో భాషాంతరీకరణములనుగూర్చి ముచ్చటించుకొందము ... శాకుంతలముపై 8 భాషాంత రీకరణములు గలవు ... (1) పరవస్తు వెంకటరంగాచార్యయ్యవార్లంగారాంధ్రీకరిం చినది. వీరు సంస్కృత ప్రాయముగాఁ దెనిఁగించిరి. (2) దాసు శ్రీరాములుగా రాంధ్రీకరించినది. వీ రచ్చతెనుఁగునఁ దెనిఁగించిరి. (8) కందుకూరు వీరేశలింగము

గా

ఆంధ్రీకరించినది. వీరు ... సులభముగాఁ దెలియురీతిని దెనిఁగించిరి. (4) రాయదుర్గము నరసయ్యశాస్త్రులుగారు ఆంధ్రీకరించినది. (5) వడ్డాది సుబ్బారాయఁడుగారు ఆంధ్రీకరించినది. వీరు మక్కికిమక్కిగా నాంధ్రీకరించిరనవచ్చును. (6) వేదము వేంకటరాయశాస్త్రులుగారు ఆంధ్రీకరించినది. వీరు స్వేచ్ఛగా వ్రాసివేసిరి. ఈ యాఱింటిలోను బరవస్తు వెంకటరంగాచార్యులయ్యవార్లంగారు వ్రాసినది మొదటిదై యుండవచ్చును ... విమర్శనకు గుణదోషములు 2 ను నెత్తుకొని విమర్శింపవలసి యున్న మాట సాహిత్యశాస్త్రముచే బోధపడఁగలదు. ఆశాస్త్రము "దోషహీనం గుణాధానం కర్తవ్యం నియమాత్కృతౌ" అని చెప్పుచున్నది. కాన దోషహీనము గుణాధానముఁ జేసిన విమర్శకుఁడు కవికి ... మిత్రుఁడే. కావున నన్ను శత్రునిగా నెంచుటకు వలనుగాదు. ఈవిధముగా ... విమర్శనములు హెచ్చి సారస్వతము కొంత యభివృద్ధిలోనికి వచ్చినది. ఇప్పుడు మన సారస్వతములోఁ బద్యకావ్యములు వచన కావ్యములు ఖండకావ్యములు నవలలు ద్విపదలు నాటకములు వ్యాఖ్యానములు విమర్శనములు మున్నగునవి హెచ్చుగా బయలుదేఱుచున్నవి. ఈవిధముగాఁ బరిశీలన మెక్కువైనది. అందులకు సంతోషము ... ఇంకను విమర్శనము లెక్కువ కావలయును. ఎక్కువగాకున్న సారస్వతము సరిగా నడువదు ... సారస్వతాభివృద్ధి క్రమముగా నౌఁగాక.

---

## మద్రాసున్యాయమూర్తి యేకేగారు

ఈనాఁటికిఁగాని యింకను 50 ఏండ్లకుఁగాని 100 ఏండ్లకుఁగాని వివాహబంధముయొక్క యాధ్యాత్మికశృంగారరసాదులఁ జెడఁగొట్టునట్టి మార్పులను శాసించుచుఁ జట్టముల నిర్మించినయెడల ... మానవజాతి క్షేమశ్రేయములకు విధ్వంసకములై పరఁగుచున్నవి.

సాయంకాలనటన్మహానటజటాఝూటాటవీదోర్ధునీ
స్ఫాయద్భంగఘుఘుంఘుమోపమితవాచాచాతురీధుర్యుఁడై. 131

గీ. అవధరింపుము విక్రమార్కావనీంద్ర!
చిన్ననాఁ డేను గన్ను కాశీపురస్థ
లావలోకనకాంక్షచే నరిగి యరిగి
జంబుకేశ్వర మనుపట్టణంబుఁ జేరి. 132

గీ. కంటిఁ బాంథజనాహ్వానకారి మృదుల
వాతపోతచలత్పటకేతనాంక
మై, మదీయశ్రమచ్ఛిదాహారి యగుచు
నలరు నొకవంటకూలి యొయ్యారియిల్లు. 133

సీ. పాళి పుట్టించె సద్యఃకల్పితానల్ప
రసపూర్ణగాథా దురంతపటిమ
రక్తి గల్పించె ధారాళవాచాసుధా
మాధురీధుర్య సంగీతరీతి
తెలియఁజేసె ననేకదేశస్థాంతరా
రాశికాంతర నికరప్రపంచ
మస్ఫురం బొసఁగె శబ్దార్థవైచిత్రి ని
బంధనోజ్జ్వల గద్యపద్యసమితి
తద్గృహంబుల కన్నకల్పిత తారకాయ
మాన సోమసమానీతులైన పథిక
కథికగాయకచారుసత్కవుల యుదర
పూర్వగంతర సల్లాపములు నరేంద్ర! 134

చం. చిటిలిన నాభినామ మొకచేఁ దెలనాకులు చాయతోడిపు
క్కిటివిడెమున్ బెడంగుగ బిగించిన పైఁటచెఱంగులోనఁ బి
క్కటిలు కుచంబులుం బసిఁడికమ్మఁ దళుక్కను చెక్కుదోయి చొ
క్కటముగ ముద్దుగుల్కు నొకకల్కి వెసం జనుదెంచి యచ్చటన్

సీ. మఱి వండిపెట్టు కొమ్మలులేరె మావెంటఁ
బడుదు రటంచును బాయఁబలికి
పోవఁజూచినఁ బట్టిపోదు, రిదేల, వా
దాడఁజాల మటంచు నాసగొలిపి

అటువంటివారమా, ఆఁకలిదీర్పు, మి
క్కిలిపుణ్యమన్న నంగీకరించి
కమ్మలు గదలఁ గన్బొమ్మలు నిక్కిడ
ఆరజమ్ముననఁ గూలిబేరమాడి
వచ్చుతెరువరు లందఱు వంటపనికి
నన్ను మెత్తురటంచు నందములు సూపి
బాళి పుట్టించుదాని కప్పథిక లెల్ల
ఒడఁబడి కెమీఁద నే మిన్కు లొసఁగి రపుడు. 136

తే. వారితో నేను భుజియించి వనజబంధుఁ
డస్తగిరిఁజేరుతఱియైన నపుడు నదికి
పోవువారలఁజూచి నేఁ బోక నిలిచి
సంధ్యవార్చితి జలము లాసతి యొసంగ. 137

కం ఆసమయంబునఁ జీఁకటి
మాసిన తన ముదుకచీర మైకలనిగ్గుల్
వాసులకుఁబెనఁగఁగా నొక
దాసి యరుగుదెంచి యొకసుధాకరముఖితోన్. 138

కం. ఏమో గుసగుసలాడిన
ఆమగువ మఱేమిసేతు, ననువగుమగవాఁ
డీమాటకు నొడఁబడఁ, డ
క్కామినియెడ మాట నిల్పఁగా లేనైతిన్ 139

కం. అనుమాటలు సవసవగా
విని నే నేమో ప్రమోషవిధమని చేరన్
జని యది యేమని యడుగన్
కనుఁగొని యమ్మగువ ముఖవికాస మెసంగన్. 140

తే హత్తుకోవచ్చు నీవంటి యందగాని.
కున్న దొకచోట నొక మంచియొఱపులాడి.
దాని కిలికించితంబునఁ దవిలిపట్టి
వాఁడు దేవేంద్రునకుఁ జిట్రావాసుఁగలఁడు. 141

మ. అను నమ్మాటలతోడ నే రతిపతిజ్యావల్లికాటంకృతుల్
విని తా మంచిది పోదునాయనుచు నన్ వీక్షించి యయ్యంబుజా

నన సేబాసు! బలార! జాణవపుదన్నా! ఇంతతెం పొందకుం
డినవాఁడేమగవాఁడు? నీతపము పండెన్, నిండె సౌఖ్యస్థితుల్, 142

తే. పట్టణ నియోగియగు గుణభద్రుఁడనేఁడు
భూసురుం డొక్కఁడియ్యూర వాసిగనియె.
వాని బంటునకున్న యైశ్వర్యగరిమ
పడసినఁ గుబేరుఁడైనను బ్రదికిపోవు. 143

మ. అలరుందూపులమన్నె వాని మగవాఁడన్పించుఁ దత్కాంత. అ
య్యలివేణీమణి జారసంగమసుఖైకాకాంక్షచే దీని ని
చ్చలు నాయింటికిఁ బంపు నొక్కని మహాచాతుర్యధైర్యాప్తి మె
చ్చులొసంగం దగువానిఁగాఁ బనుపుమంచున్ దైన్యపూర్వంబుగన్.

కం. ఏనును మాలిమిగల మగ
వానికి నిది యెఱుకసేయ వడవడవడఁకున్
గాని చన వెఱచు వాఁ. డ
మ్మానినితోఁ బ్రొద్దు గొంచెమా యొనఁగూడున్. 145

తే. అట్టిచో నెట్లుపోవుదునంటివేని
తద్గృహము చెంత నొక వటతరువు గలదు.
దానిపై నెక్కి చీఁకటిగాన నిపుడె
ఊడవెంటనె దిగు. మొనఁగూడుఁ బనులు. 146

తే. కాంతిమతి దానిపేరు. తత్కాంతుఁ డధిపుఁ
డనుపఁగా దూరభూమికి నరిగినాఁడు.
నడచి యిచ్చటి కతఁడు రాఁ దడవుపట్టు
వేగఁజను. మిందులకుఁగాను వెఱవవలదు. 147

కం. అని నన్నుఁ బలికి దానిన్
కనుఁగొని యమ్మగువ కింతకార్యం బోజ
వ్వని! వే తెల్పుము పొమ్మని
అనుపఁగ నది వెడలిచనియె. అంతట నేనున్. 148

మ. తరలంబైన మనోంబుజంబు ఘనసంత్రాసంబుతోఁ బోరి శం
బరవిధ్వంసి మహాప్రతాపము జయింపం గాంతిమత్యాలయాం
తరముం జేరఁగ నిశ్చయింప వట ముద్యత్రెప్తిమల్ మీఱి నె
క్కి రహిన్ శాఖలవెంటనే యరిగి తద్గేహంబునన్ డిగ్గితిన్. 149

ఉ. అంతకుమున్నె యచ్చటి కొయారముమీఱఁగ వచ్చియున్న త
త్కాంతిమతీవధూటి ననుఁ గన్గొని మో మరవాంచి నిల్చినన్
చెంతకుఁ జేరి దాసి యిది సిగ్గుపడన్ సమయంబటే, గృహా
భ్యంతరసీమఁ జేర్పుదమటంచు ననుం గొనిపోయి రిద్దఱున్. 150
చం. బటువులుతాపి తా పలుపుపట్టుతలాడముమీఁదఁ జల్వదు
ప్పటిపయిఁ జప్పరంపు జిగి బంగరుఁ బ్రాఁత కురాళముం గురం
గటఁ బడిగంబుఁ గంచుదివగంబము గల్గిన పట్టెమంచ ము
త్కటరుచి నించ మించు రతిధామముఁ జేరితి నిశ్చయంబునన్. 151
తే. అంతట భుజించి నను వినయంబుదోఁప
మంచమున నుంచి యక్కాంతిమతిని జూచి
ఎనసెఁగదవమ్మ నీమనోభీష్ట, మితని
అలరుఁ బ్రాయంబు కొల్లాడు మనుచుఁబలికె 152
శా. నన్నీక్షించి సనుస్తదేశతరుణి నానారహః క్రీడలన్
కన్నా. వందపుజాణ. విక్కలికి బొంకన్ లేదుచుమ్మా. మెయిన్
చిన్నెల్ నించకుమా బయల్పడిన నాచేఁగాదుచుమ్మా, ప్రజన్
కన్నుల్ మూయఁగ. నీకుఁ దెల్పవలెనా కార్యం బకర్తవ్యమున్ ? 153
కం. అని తలుపుమూసికొంచుం, జనియెం దద్దాసి గడియ చక్కఁగఁ బొంకిం
చి. నెలంతయంతఁ దల్పంబున కొయ్యన వచ్చె నగపు మొగము నఁదోఁపన్.
తే. ప్రథమసంగమకేళి నప్పటికి నంత
ముగ్ధయనిపించి పిదప నమ్మోహనాంగి
జాతివారాంబుజేక్షణల్ సైత మింత
నేర రనిపించెఁ గలయికయారజముల. 155
మ. సభలోనన్ వివరింపరాదెకద! తచ్చాతుర్య! మెంతంచు నే
నభివర్ణించెద? అంశుమత్కర దురాపాంతఃపురావాస యా
ఇభయానామణి. ఎందు నేర్చినది హా యీకౌశలంబంచు నే
సభయాశ్చర్యతఁ జెందితిన్ మహిమ నాసాతజ్ఞనీయోగమున్. 156
ఉ. ఎంతకునేర రంత తెగియించినవా? రది యున్న దేకదా !
అంతటఁ దెల్లవాఱిన లతాంగి ననుం బడుకింటిమిద్దెపై
దంతపుమేలుమంచము సుధాకరకాంతగృహాంతరంబులో
ఎంతయుఁ జింతలేక వసియింపఁగఁ జేసెను సాహసంబునన్. 157

ఇందువలన మనదేశమునఁగల పసిపిల్లలవగ్గఱనుండి రమారమి తలకు 2 రూపాయలకుఁ దక్కువగాని రొక్కము లంపను కనుపుచున్నామని నిశ్చయము. ఒకొక్క కుటుంబమునుండి యీవిధమున నెన్నిద్రవ్యములు దేశాంతర మగుచు చున్నవో గమనింపుఁడు. తొలుదొల్త యింగ్లాండుబట్టల వెల స్వల్పమై చూడ నందముగ నుండుచు వచ్చినందున మనవా రప్పు డింటింట వాడుచుండిన కుల దేవతలగు రాటములు మూలఁబడవైచి సోమరులై దారము తీయుట మఱచిరి. నేతపని మాని మగ్గములఁ గట్టిపెట్టిరి. ఈసంగతి నెఱిఁగి యాంగ్లేయు లిపుడు మరవస్త్రములకును నూలుకును 2, 3 రెట్లుగ వెల పెంచిరి. మనవారు వస్త్రము లావెలకుఁ గొనఁజాలక పలుబాధలు పడుచున్నారు. బుద్ధిమంతు లీతంత్రము నెఱిఁగి మనదేశమున రాటము నింటింటఁ బునఃప్రతిష్ఠ గావించి దేశదారిద్ర్య నివారణకొఱకు దారము తీయునట్లును మరల మగ్గములు సాఁగించి నేత నేయు నట్లును బ్రోత్సహించుచున్నారు. ఈకార్యము చక్కగ సాఁగిన మనదేశ మున రమారమి యింటికిఁ బదిరూపాయలు మొత్తము దేశాంతరముల కరుగక నిలఁబడఁగలదు.

జగ:— రాటము కులదేవత యంటి వేమిటి ?

కృ:— పూర్వకాలమున మనదేశమున నన్నికులములవారును రాటమును గులదేవతగా వాడుచుండిరి. నూతనదంపతులు ముందుగ దీనిపూజ గావించి గృహంబుల నుంచుచు వచ్చిరి. కావుననే యిప్పటికిని వివాహములు జరుగునప్పు డీరాటమునకు బదులు దారముగల కదురు పొరుగింటి పుణ్యస్త్రీవలనఁ దీసికొని వచ్చుటయు దానిని గులదేవతయని వాడుటయు జరుగుచున్నది. ఇఁక వస్త్రము లెట్లు వాడఁదగినది వివరించెద. వినుఁడు. వస్త్రములను బిగించి కట్టరాదు. వస్త్రములు కట్ట నారంభించిన పిల్ల లీయలవాటు చేయుదురు. అట్లు బిగించికట్టిన రక్తమున కడ్డుకలుగుటే కాక రొండిగజ్జి మొదలగు చిడుములు దేహమున నుత్పత్తి యగును. వస్త్రములు పెక్కురంగులచే నలరారుచుండును. అన్నివర్ణములలో శ్వేతవర్ణ ముత్తమము. స్త్రీజనులు సామాన్యముగ వివిధవర్ణముల నలరు వలువల ధరించుచుందురు. వయోవృద్ధలైన వెనుక వారి కట్టికోరిక మట్టుపడును. మనము ధరించువస్త్రముల వర్ణము మన యారోగ్యమునకు సంబంధము కలిగియుండును. శ్వేతవర్ణమునకుఁ గందోష్ణాకర్షణశక్తి తక్కువ. అసితవర్ణమున కధికము. కావునఁ దెల్లని-చీరలధరించువారికి దుర్గంధవ్యాప్తములగు నంటుజాడ్యము లంతగ సోఁకకుండుటే కాక యుష్ణాధిక్యబాధయుఁ దఱిగియుండును. నల్లవలువలుధరించువారికి రెండుబాధలును మెండు. ఇతరవర్ణము లీరెండురంగులకు నెంతసమీపముగ నొప్పుచుండునో యంతకుఁదగినటుల నీగుణముల నిచ్చుచుండును. మనము ధరించుచేలము లెపుడును బరిశుభ్రముగ నుండవలెను. అట్లుండనివి మనకే యింపు నింపఁజాలనపు డొరుల కెట్లుండునో వేఱుగఁ జెప్పనేల ?

మలినాంబరము లారోగ్యభంగకరములు. కావున ధౌతవస్త్రధారణము తఱుచుగ నొనరించుచుండవలెను. పంట దేవారాధన చేయునపుడును భోజనసమయమునను మిగుల శుచిరై యుండుటకుఁగాను మడుఁగుల ధరించుచుందుము. అట్టి తరుణములందు మన కితరస్పర్శ యే మాత్రము కలిగిన నది యనాచారముగ నెంచి కట్టినపుట్టముల విడిచి వేఱుగ నాదిన మాఱవైచిన వస్త్రముల ధరించెదము. శరీరములతోపాటు చీరలకును మా శుద్ధికము. అందువలనఁ దొకరోజున నుతికి యాఱవైచిన వస్త్రము మఱుదినము దపరాహ్నమునకంటెఁ బరము మడి కనుపయోగమని మనవారు నిర్ణయించియున్నారు. మఱిది యుతికి మాలిన్యము బాఱిపోవునట్లు బాదించి పిడిచి మడుతలు లేకుండునట్లు విదిలించి యాఱవైచిన వస్త్రమని పెద్దల నిర్ణయము. కొందఱుసోమరు లట్లు కావింపక మఱికిగుడ్డల నీట ముంచి యాఱవైచి మడియని వాడుదురు. ఇట్టివారిని నిదర్శనముగ నెన్నరాదు. ఆఱవేయునపుడు మడుతలు నిలిచినట్టియుఁ గాలినట్టియుఁ గుట్టినట్టియు నెలుకలుగొట్టినట్టియు వస్త్రములఁ గట్టుట యనాచారమని నిర్ణయించిన మన వారిం గూర్చి విచారించిన శుచిలయందుఁగల లక్ష్యము కొంతవఱకైనను దెలియకపోదు. పట్టుపుట్టములకు వెల యధికము. ఆకర్షణశక్తి తక్కువ. కావున నొకపరి యుతికి యాఱవైచినవి దినములకొలఁదిఁ గట్టుట యాచారమని మన వారు నిర్ణయించియున్నారు. ఈయవకాశముచేఁ బురుళ్ళుగూడ గడపుచు వాని నుతికి యాఱవేయకుండుట నింద్యము. లోకమున సోమరు లెక్కుడగుదురని యెఱింగియే పూర్వులాచారవిధుల నింతకఠినముగ నిర్ణయించి యున్నారని యోజించినపుడు ధ్రువపడుచుండును. ఆఱవవారివలె నింటింట నెవరివస్త్రమును వారుతికి యాఱవైచికొనుట మంచిది. శరీరముల శుభ్రపఱచుకొనినట్లు వస్త్రముల నుతికికొనుటయు నుచితము. ఇది నీచమని కొందఱి తలంపు. గురుకులవాసమొనరించు శిష్యులును దేశాటనమొనరించువారును గొన్నితావుల నివసించువారును నిట్లాచరించుచుండుటం బరికింప నిది పూర్వాచారమని స్ఫురింపక మానదు. సీమదేశమున ధనికులుకాని కుటుంబములం దెల్ల నెవరియింటివస్త్రములను వారలే శుభ్రముకావించుకొనెదరు. రంగులులేని తెల్లనివస్త్రముల నరగంటసేపు సబ్బునీటియందుఁగాని చవుడో సోడాయో కల్పిన నీటియందుఁగాని నానఁబెట్టి యరగంటసే పుడుకఁబెట్టి యుతికిన మాలిన్యము వదలి శుభ్రపడును. అనంతరము నిర్మలోదకమున జాడించి పిడిచి దులిపి యాఱవేయవలెను. చవిటిమన్నో సోడాయో నీళ్ళయందుఁ గలిపిన యనంతరము వస్త్రములందు ముంచవలెను. అట్లుకానిచో వాని కార మొకచోటనే వస్త్రముల కంటి బలముతగ్గి ముందుగ నట్లంటినతావులఁ జినిఁగిపోవును.

జగ:- అబ్బా! కట్టుకొను గుడ్డలనుగుఱించి యెన్నిసంగతు లున్నవి! ఇవన్నియు దినదినము మనము చూచెడివే కాని పూసగ్రుచ్చినట్లు వ్రాసి యిట్లు తెల్పుట చాల వింతగానున్నది. ఆరోగ్యమును గుఱించి యింకను నేమేమోసంగతు లున్నవే. అమ్మక్కలుకూడఁ గొంచెము వినిపింపు. ఎందుకైనను వినియుండిన మంచిది

కృ:- ఇవి దినదినము నొనరించుపనులే కాని వీనినిగుఱించి గ్రంథస్థవిషయముల నొకసారి వినియుండిన నాచరణలోపము లప్పుడప్పుడు స్ఫురణకువచ్చి మేలుకావించును. కావున స్వల్పవిషయములైనను గించిత్తుగనైన నెఱిఁగియుండవలెను. దినదినము మనము స్నానము చేయుచుందుము. దీనినిగుఱించియుఁ గొంచెము ముచ్చటించుట ముఖ్యము. కావున నుపన్యాసమంజరినుండి యీవిషయమున 4 మాటలు వినిపించెద: ఆలకింపుఁడు.

## — స్నానము —

దేహారోగ్యము కాపాడుకొనుటకు దినమున కొకసారియైనను స్నానమాచరింపవలెను. దృఢశరీరముకలిగి మంచియారోగ్యదశ ననుభవించువారు శీతోదక స్నాన మొనరించవలెను. తదితరు లుష్ణోదకస్నాన మొనరించుట మేలు. మోచేయి నుష్ణోదకమున ముంచి వేఁడి తెలిసికొని యట్టినీరు పసిపిల్లలకుఁ బోయవలెను. తఱుచు పనుల నొనరించుచుండుటచేతను వేఁడిపట్టు నలవాటు కలిగియుండుటచేతను మన యఱచేయికిని వ్రేళ్ళకును నీటియుష్ణత సూక్ష్మముగఁ దెలియుట కష్టము. మిక్కిలి వేఁడినీరు పసిపిల్లలకుఁ బోయరాదు. కావున మోచేతఁ గనిపెట్టి యట్టినీరే పోయవలెను. వేసవికాలమునను బూర్ణారోగ్యముకలిగి పాటుపడునప్పుడును దినమున కిరుమాఱులు మువ్మాఱులు స్నానమాచరింపనగును. వేకువజామున శీతోదకస్నాన మొనరించి కొంచెముగ నుదకపాన మొనరించుటచే ననేకవ్యాధు లడుగంటి పూర్ణారోగ్యము కలుగును. దీనిచే నజీర్ణ ముడిగి మలబంధ మడఁగును. కావున నది మానవుల కాయుర్వృద్ధికర మగును. ఈకారణముచేతనే పూర్వు లుషస్స్నానముల విధించియున్నారు. భోజనానంతరము స్నాన మొనరించుటచే నజీర్ణము కలుగును గావున శిశువుల కట్లు స్నానము చేయించరాదు. ఆరోగ్యవిధులుగ నిర్ణయించిన ప్రత్యాచరణమునందును మనవారేకక్రియా ద్వ్యర్థకరీయను నట్లు భగవదారాధనపరత్వము నిమిడ్చియున్నారు.

జగ:- మన మారోగ్యముగానుండుటకు వ్యాయామముగూడ నవసరమంటివిశద! దానిగుఱించియుఁ గొంచెము వినిపింపు. అక్కడితో సరిపోవును.

## — వ్యాయామము —

కృ:- వ్యాయామమనఁ బరిశ్రమము. ఒడలలయున ట్లేదేని యొకపని చేయక భుజించినఁ బదార్థమంతయుఁ జక్కగ జీర్ణమై యొంటఁబట్టదు. పనులెల్ల స్వయముగ నొనరించుకొను మనవంటివారికిని బాటుపడిజీవించు నితరులకును నిట్టివ్యా

యామ మంతగా నవసరముకాదు. బొత్తిగాఁ గాయకష్ట మొనరించు నవకాశములేని యైశ్వర్యవంతు లది చేయనిచో రోగిష్ఠులగుట నిశ్చయము. పాలు ద్రావెడు శిశువులు మొదలు కఱ్ఱపట్టుకొని నడిచెడు ముదుసళులవఱకు నెల్లరకును వారివారి పరిస్థితుల ననుసరించి తగురీతిని వ్యాయామ మొనరించుట ముఖ్యము. పసిపిల్లలు కాలుచేతు లూఁపుటయు నాడుటయు వ్యాయామమగును. వృద్ధుల కిటు నిటు తిరుగుటయే వ్యాయామమగును. వ్యాయామము లేనిది శరీరావయవములకు బలము కలుగదు. వాడుచుండు బిగపు టినుమైనను దళతళ లాడుచుండును. గూట నుంచినది తుప్పుపట్టి వంచిన విఱుగునంత బలహీన మగును. పరిశ్రమలేనిచో శరీరమంతటను వ్యాపించియుండు నరములును గండలును బలహీనములై యేమాత్రము కష్టము సహించలేక చలిగాలికి జలుబును వేఁడిగాలికి గాఁకయును గలిగించుచు రోగగ్రస్తుల నొనరించును. పనిచేయనివారి జీర్ణకోశమునందలి జఠరాగ్ని బలముతగ్గి తినినపదార్థముల నెల్లఁ జక్కఁగఁ బచనము చేయఁజాలనందున నజీర్ణవ్యాధి యంకురించును. సర్వరోగములకు నజీర్ణము మూలమని మన మెఱుఁగుదుము. పరిశ్రమచేయువారి దేహములు బలిష్ఠములై శీతవాతాతపములకు మార్పులొందక నీరోగములై యుండును. అందువలననే కాయకష్ట మొనరించుచు నెండయు వానయు లక్ష్యములేక జీవించు సామాన్య కుటుంబములవారలలో బహుజనులు బలాఢ్యులు నారోగ్యులు నై యుండ నైశ్వర్యవంతులు పెక్కండ్రు బలహీనులుగను రోగిష్ఠులుగను నుండుట చూచుచున్నాము.

తే. గీ. చేయఁ బనులెల్ల నొడలికిఁ జేవ కలుగు.
చేయనొల్లని యొడళులు చీకు లగును.
దున్న నిరువదియేండ్లైన దుక్కిటెద్దు.
లాలపోతులు పదియేడులైన మనవు.

కావున మన కాహారాదికములతోపాటు దేహపరిశ్రమము ననుదినావసరమని యెఱుఁగియుండవలెను. ధనికులయిండ్లయందుఁ గొన్ని తావుల నుత్తమస్త్రీలు పనిలేకుండఁ గాలమును వ్యర్థపుచ్చఁజాలక రామాయణాదిగ్రంథముల వ్రాయుచును బూదండలం గట్టి దేవాలయముల కనుపుచును గాలము గడపుచుందురు. కొందఱు విలాసార్థముగ మెడపట్టి టోపి చిలుక మొదలగువాని నున్నితోడను నూలుతోడను నల్లి ప్రియబంధువుల కనుపుచుందురు. కొందఱు గవ్వలు గచ్చకాయలు నాడుచుఁ గాలము గడపుదురు. కాయకష్ట మొనరించుచు నింటిపనుల నెల్లఁ జక్కఁబెట్టుకొనువారికి విరామముకలిగినప్పు డిట్టి యనాయాసకరములగు పను లుల్లాసకరములగుం గాని బొత్తుగ శరీరమున దినదినము ముమ్మారైనఁ జెమట నంకురింపఁజేయు పనులు లేనివారి కిట్టిపనుల నొనరించుట దేహారోగ్యప్రదము కాఁజాలదు.

## —♦ భాగినేయులు ♦—

భాగినేయురాలైన శ్యామలాంబ పాణిగ్రహణము చేసిన యప్పయ్యతో ముప్పది యాఱు వర్షములు ముచ్చటగాఁ గాఁపురము చేసినది. ముగ్గురు నల్గురు బిడ్డలను గన్నది. అం దిరువు రచిరము మ్రందిరి కాని యిరువురు పెరిఁగి పెద్దయైరి. వారిలోఁ బ్రథముఁడు శేషాచలము. వాని కింగ్లీషు చెప్పించిరి. మ్యాట్రిక్యులేషను ప్యాసు చేయించిరి. రివిన్యూ శాఖం బ్రవేశపెట్టిరి. చాలకాల మవ్వాఁడు తాలూకాగుమాస్తాగా నుండెను. రెండు మూఁడేండ్లు రివిన్యూయినస్పెక్టరుద్యోగముగూడఁ జేసెను. క్రమక్రమముగాఁ బ్రమోషనగుటయుఁ గలెక్టరాఫీసుగుమాస్తాగా శేషాచలము చెలఁగుచున్నవాఁడు. బుద్ధిమంతుఁడని భూషింపఁబడుచున్నాఁడు బాల్యముననే వానికిఁ బరిణయ మైనది. నాగరాజాపల్లె నివాసులైన జంధ్యాల పెదసుబ్రహ్మణ్యశాస్త్రిగారి బిడ్డ సుబ్బమ్మ పెండ్లము. సుమారిరువది సం॥ల నుండి సుబ్బమ్మయు శేషాచలము ననుకూలదాంపత్యసుఖ మనుభవించుచున్నారు. అప్తాపత్యులుగూడ నైనవారు. అందొకరిత స్త్రీ ఒకఁడు పురుషుఁడు. పురుషుఁడే పూర్వజుఁడు. వాని పేరు లక్ష్మీనరసింహము. ప్రకృతము (1914) ౧౧ సం॥ల ప్రాయము. అప్పుడే యాంగ్లేయవిద్య యారబ్ధము. స్త్రీ పేరు సీతాలక్ష్మి. [illegible]వత్సర ప్రాయ. దాని కప్పుడే ధవుఁడు సిద్ధమైయున్నాఁడు వాఁడు తండ్రిమేనమామయైన మేళ్ళచెఱువు కామయ్య దత్తపుత్రుఁడు. మేనమామకూఁతునే వీరికి వివాహము చేయుట విధియైనను నట నభావమగుట నిటుచేయవలసివచ్చెను. వెలువడిచిన మేనమామ కొకనికి బాల యొకతె యున్నదికాని కేవలము మేనత్తకొడుకుబిడ్డయని కోడలివరుసయైనను నీవిధము నిశ్చయింపఁబడినది. ఇప్పటి వారసత్వముగూడ నిందులకు హేతువైనది. ఇట్టి చిట్టిసంతానముతోడను సొంతయు బుద్ధిమంతురాలైన యింతితోడను నేఁబది రూపాయల వేతనము తెచ్చికొనుచు శేషాచలము చిన్న గృహస్థుగాఁ జెలఁగుచున్నాఁడు ప్యాలకకుటుంబమును సవరించుచునే వీని తాత మహాదేవయ్య స్వకుటుంబమును సంపన్నము సల్పుకొనెను. వేఱుగా వేశ్మమును వినిర్మింపించెను. ప్యాలకపుత్రుఁడగు మేళ్ళచెఱువు సుబ్బయ్య స్వకుటుంబమును సవరించుకొనుటకు సమర్థుఁడగుటతోడనే తాఁగట్టించిన ధామమునఁ బ్రవేశించెను. పౌరోహిత్యాదికముచే బాగుగా సంపాదించెను. సహస్రబ్రాహ్మణసమారాధనాది సత్కార్యములుగూడ సలుపఁగలిగెను. ఆత్మజుఁడైన యప్పయ్యను నర్సారావుపేట డిస్ట్రిక్టుమునసబుకోర్టు ప్లీడరులైన వంకాయలపాటి శేషావతారముగారివద్ద గుమాస్తాగా గుదిర్చెను. ఆగుమాస్తాగిరినుండియే యప్పయ్యయు నర్థార్జనసమర్థుఁడయ్యెను. స్వార్జితపిత్రార్జితములనుండి సన్నసన్నగా నంతయో యింతయో యప్పులిచ్చుటకుఁగూడ నారంభించెను. అట్టి పిత్రార్జితమునకు స్వార్జితము జతఁజేసి హర్మ్యమొకటి నిర్మించుకొని యానర్సారావుపేటలోనే శేషాచలము క్షితిపతీయోద్యోగమును చేయుచున్నాఁడు. తల్లిని జెల్లెలిని దండ్రిచెల్లెలిని దనపోష్యవర్గములో నునిచికొనినాఁడు. వాండ్రును వలసినంత తోడ్పాటుతో వాని వర్ధిలఁజేయుచున్నారు.

అవ్వానితరువాతి యప్పయ్య శ్యామలాంబల యపత్య మన్నపూర్ణ. అది యనమడల గ్రామవాసి చింతలపాటి సుబ్బయ్య యింతి. వీఁడు వేయియో రెండువేలో విత్తమెత్తు నగ్రహారమున కధ్యక్షుఁడైన పార్వతీశము ప్రథమకుమారుఁడు. ఆపార్వతీశ-

మప్పయ్య మేనత్తకొడుకు. మేనత్తకొడుకును మేటియగ్రహారికుఁడు నగుటనే యప్పయ్య యాపార్వతీశము నాత్మజాన కనుఁగుంగూఁతు నర్పించి యత్యంతవైభవముతో నవ్వివాహ మాచరించెను. కాని యాత్మజ రజస్వలగాకపూర్వమే యల్లుఁడు చెల్లెను యావజ్జీవము నంగలార్చెను. శ్యామల దుఃఖ మింతింత జెప్పవలసియే లేదు. బాలవిధవయగు పట్టిని జూడలేక బహుకాల మది వనవివనవి యన్నమునీళ్ళు వర్జించి కృశించి కడకు గుండె రాయిఁజేసికొన్నది. అన్నపూర్ణ యజ్ఞానదశయందే యాప్తవైధవ్యయై పుట్టింటనే పోష్యచుం బడియున్నది. అప్పయ్య బ్రదికియున్నప్పుడే యద్దాని భరణమునకై పార్వతీశమును బ్రార్థించెను. కాని యతఁ డంత తెంపుగలవాఁడు గాకుండుటఁ గడపి గడపి కడకు సం॥కు 75 రూపాయ లిచ్చుటకు సమ్మతించెను. ఇట్లొక కొంతకాల మిచ్చెను. వదపడి పార్వతీశమును బంచత్వ మొందుటయుఁ దద్ద్వితీయపుత్రుఁడు రామయ్య తగ్గించిరో యెగ్గించిరో యిచ్చుచున్నవాఁడఁట. అన్నపూర్ణ యన్న శేషాచలముపోషణలో నుండుచు నత్తింటియర్థము ననంతరజీవికకుఁగా వడ్డికిచ్చి వృద్ధిఁ జేసికొనుచున్నది. అది లెక్కడొక్కయే కాక లిఖితముద్రితముల లీలమైఁ జదువఁగలది. చదివినది సగమో పాంతమో యర్థముగూడఁ జేసికొనునది. కాని యయ్యర్థ మైహికమునఁ గాక యాముష్మికమున వ్యయపెట్టుట యభ్యసింపవలె.

భగినులలోఁ బ్రథమురాలైన విశాలాక్షమ్మకు మగని తమ్ముని కొడుకు కాలభైరవుఁడు దత్తుఁడు. దత్తస్వీకారాదికము జరిగినదో లేదో తెలియదు కాని తద్దినాదులు మాత్రము తద్దత్తుని తలఁ బడినవి. ఔరసుఁడుగామిని నన్యోన్యప్రేమలు మాకంతగా నగపడకపోయినను భాగినేయగణములో మాత్రము ప్రథముఁడైనవాఁడు. తండ్రులే యావిభక్తులగుటఁ దద్దత్తుఁడు సహోదరులతో సమముగనే యాస్తిని బంచుకొనియెను. ఆవ్వాని కంబాపురవాస్తవ్య చల్లా సీతమ్మ స్వతనయ లక్ష్మమ్మను సమర్పించుటయు నద్దానివలనఁ గొడుకొకఁడును గూఁతురొకర్తెయుఁ గలిగిరి. కొడుకు రామకృష్ణయ్యకుఁ గనిష్ఠ తనయ లక్ష్మిని దనతనయ వరలక్ష్మిని లంకా పేరావధానులకును బెండ్లిచేసి పితృపరంపరాగతమగు హైదరాబాదుపౌరోహిత్యమును బచరించుచు నటఁ గొంత కాలము పల్లిగుంటను గొంతకాలము వెళ్ళించి యేఁబదవపడునడి నీలోకమును విడిచి పోయెను. కొడుకు రామకృష్ణయ్యగూడఁ గొంతకాలము హైదరాబాదునను గొంత కాలము పల్లిగుంటను దండ్రివలెనే తానును వెళ్ళించి యీవిక్రమ సం॥ చైత్ర (1940 ఏప్రియల్) మాసమున హైదరాబాదునుండి వచ్చుచు గుంటూరులో దోషజ్వరమున నకాలమరణము నంది యాత్మీయుల కగ్గలము వ్యథ గలిగించెను. కాలభైరవుని యల్లుఁడైన పేరావధానులు క్రమాంతమో ఘనాంతమో స్వాధ్యాయము చక్కఁగాఁ జదివిన సద్బ్రాహ్మణుఁడు. జన్మభూమి పల్లెగుంటదగ్గఱి కొదమగుండ్లయే కాని గుంటూరులో నుండుచున్నవాఁడు.

తదనంతరభాగినేయుఁడు గౌరిపెద్ది యప్పయ్య. ద్వితీయభగినికి వీఁడును దత్తుఁడే. ఆద తతయు నామెయనంతిరమైనదే. ఎట్టులైనను దద్భగినికిఁ దద్దినము పెట్టుచుండుటచే భాగినేయులలోఁ బరిగణింపక తప్పినదికాదు. అంతియే కాని మేనమామలపై నుండఁదగిన ప్రేమ వానికిని లేదు. మేనల్లునిపై నుండఁదగిన ప్రేమ మాకును లేదు. తాదృజ్జ్ఞాతులత్వమే కాక తల్లి చెల్లెలికి మగఁడగుటగూడఁ దటస్థించినందున మా యన్న వెంకటప్పయ్య కుటుంబమందు మాత్రము వాని ప్రేమ యనూనము. వానికే

కాదు. వానిసహోదరులకును జననికిని నందఱకు నట నత్యాధికము వాండ్రయింటికి
వచ్చినప్పుడైనను నిరుగున నేయున్న నన్నీక్షింపనుగూడ నీక్షింపరు. ఆహ్వానించినను
ననుగ్రహింపరు. పెత్తండ్రియే యీయప్పయ్యను బెంచుకొనియెను. మాయక్క
జోగమ్మ మరణించిన తరువాత మఱియొక పెండ్లి చేసికొని యాపెండ్లము నాయన
దత్తస్వీకారము దా రొనరించిరి. కాని దత్తుఁడు దత్తుఁడగువఱకుఁ దండ్రికూడ
నుండమిఁ దనను జ వీనిని దాఁ బెంచినది. పెద్దఁజేసినది. కన్నతలిదండ్రులుకూడఁ గష్ట
సుఖములు విచారించుచుఁ గనిపెట్టిరి. అంతియేకాక యాత్మజను బదులిచ్చియే
యవ్వాని వివాహమాచరించిరి. వివాహిత లంకా కొండయ్య బిడ్డ సీతారామమ్మ.
పెండ్లిపేరంట్రములు చేసి మేనత్త వీనిపైఁ బెత్తనము పెట్టుటయు లౌకిక వ్యాపార
పౌరోహిత్యా ద్యనేకమార్గముల నెట్లో జీవించుచున్నాఁడు. సంతానము సున్న.

మీఁదటిభాగినేయుఁడు మేళ్ళచెరువు కామయ్య. అంతిమభగినికి వీఁ డౌరసుఁడే
కాని దత్తుఁడు గిత్తుఁడు కాఁడు. భగినీరక్తసముద్భవుఁడగుటచేతనే స్వభాగినేయతను
సార్థకఱచుచుఁ జనునంతవఱకు మాపైఁ జాలఁబ్రేమతో నుండుచువచ్చెను. స్తనంధ
యత్వముననే వీనికిఁ దండ్రియే కాక తల్లియు గతించుటయుఁ బెత్తండ్రి యజ్ఞయ్య
భార్య వెంకమ్మ తన స్తన్యమిచ్చి తాఁ బెంచెను. మహాదేవయ్య మేనేజిమెంటులోనే
యుపనయన మొనరింపఁబడియెను. అనంతరము చినపెత్తండ్రికొడుకు సుబ్బయ్య
పెత్తనమునకు వచ్చెను. సామాన్యమైన చదువునఁ దప్ప నేరిచేతను గామయ్యచే నింగ్లీ
షులో వేలుపెట్టింపఁబడదు. కాని కడకు సుబ్బయ్య యేప్లీడరుగుమాస్తాలదగ్గఱనో యింత
లెక్క డొక్క నేర్పించెను. గొప్పప్లీడరైన కొండుభట్ల గోపాలకృష్ణయ్యగారిదగ్గఱ
గుమాస్తాగాఁ గుదిర్చెను. పైనరువెళ్ళుటతోడనే ప్రవేశించిన కామయ్య మధ్య మార్పు
లేకుండ ద్వాత్రింశద్వత్సరములు తన్న్యాయవాదిదండనే యుండెను. ప్లీడరును గుమా
స్తాయును బరస్పరము బద్ధానురాగులయియే ప్రవర్తిల్లిరి. అందువల్లనే మల్లాది
నరసింహమూర్తిగారు ప్లీడరుపనికిఁ బ్రారంభించినపుడు తన్ను గుమాస్తాగా రమ్మ
న్నను జన్నవాఁడు కాఁడు. నర్సారావుపేట ప్లీడరుగుమాస్తాలలో కెల్ల నా
యకుఁ డనఁదగియుండెఁగాని యూరుఁ బేరు లేకుండ నుండినవాఁడు కాఁడు.
విఖ్యాతియే కాక వేలవిత్తముకూడ నార్జించెను. చిన్నతనమునఁ గొన్నినాళ్ళు
నాటకపుఁ గంపెనిం బ్రవేశించి వేషములుకూడ వేయమొదలు పెట్టుటయు బందు
గులు కొందఱు నిందించిరి. మాయన్న రామలింగయ్య బిడ్డ యనంతరామమ్మ ప్రభ
వించిననాఁటినుండియే భాగినేయుఁడైన కామయ్యయే భర్తయని పాటలుపాడఁ
బడుచుండినను దలిదండ్రులు లేని దాని పెండ్లి తాఁ జేయఁదలఁచి యున్నతదసంత
రపుటన్న వెంకటప్పయ్య యిట్లు వేషములువేయుచో నేను నీకుఁ బిల్లనీయనని యే
మేమో యనుచు వచ్చెను. పెత్తండ్రికొడుకు సుబ్బయ్యకూడ బిట్టు కోపించు
చుండెడివాఁడు. పిన్నలదగ్గఱనుంచి పెద్దలవఱకు నాటకపుఁ గంపెనీలం బ్రవేశించి
వేషములు వేయుచుండుటచేఁ గాలప్రవాహమునఁబడి కామయ్యగూడ నందులకుఁ
గడంగినను భయమువిడిచిమాత్రము ప్రవర్తిలినవాఁడు కాఁడు. బాల్యమగుట నింకను
బరమార్థమునఁ బ్రవేశింపకున్నను రాత్రివేళల సద్యఃక్షౌరములుమాత్రము చేయించు
కొనెడివాఁడు కాఁడు. పాత్రధారణ చేయనున్నదినమునఁ బగలే పనిచేయించికొని
మొలకక్షౌరమనిగూడ నలుకవహింతురేమో యను భీతి నెక్కడనో స్నానముచేసి

ముసుఁగు వేసికొనియే వసతికి వచ్చెడువాఁడు. ఎట్లైన నేమి భాగినేయుఁడైన పరమ ప్రేమాస్పదుఁడగుట భ్రాత వెంకటప్పయ్య యనంతరామమ్మనిచ్చి యతివైభవముతోఁ గృతవివాహుఁడయ్యెను. అప్పటికింకను గామయ్య కడుసంపాదనపరుఁడు కాకునికిని బెత్తండ్రికొడుకు సుబ్బయ్య సొంతసంపాదననుండి సోదరుని సుదతికి సొమ్ము పెట్టక పోయెను. కామయ్య భార్య కాఁపురమునకు వచ్చినతర్వాతఁగూడ నర్థార్జనపరుఁ డయియుఁ దన్నను గాదని యాభరణము లమర్చలేకపోయెను. అందుల కస్వతంత్ర తయే కాక యన్యత్ర సంచారమూలముగా నర్థాంగిపై నత్యనురాగము కలుగమియుఁ గారణమయ్యెను. ఆ కారణములచేతనే యాదినములలో నొక చుట్టమనియుఁ, బక్క మనియు మాటయనియు ముచ్చటయనియు మంచియనియు సెబ్రియనియు జపమనియుఁ దపమనియు నేమియు లేక గుమాస్తాపని కంపెనికార్యముమున్నగువానితోనే కాలము గడపెను. భాగినేయుఁడే యిటు గాఁ బరు లేమి యాదరింతురు? అప్పట్ల వ్యవహారము లకును నవర్థానములకును నాయూరికనేకపర్యాయము లస్మద్గమనము తటస్థించుటయు నాదరముతో నోదనము పెట్టువారు లేక వ్యాకులపడితిని. భాగినేయి శ్యామలాంబ యున్నను నప్పు డది యత్తకిందికోడలు. కోడలిదాని మేనమామకు గుమత్వమేమ ? అత్తమామ లంత తెంపరులుగారు. సాహచర్యవిశేషమున శ్యామలగూడ నట్టిదే యగుడు బందుగులయిండ్లకుఁ బనివినక పులిపాకపూర్ణయ్యగారియింటికిఁ బోఁగడఁగితిని.

సీ. భూసురుం బొడగన్నఁ బుచ్చుఁ డాయన యొక్క
అహమేని తనపంక్తి నన్న మిడక.
విద్వాంసుఁ బొడగన్న విడువఁ డాయన యొక్క
నెలయేని తనయింట నిలుపుకొనక.
యాచకుం బొడగన్న ననుపఁ డాయన యొక్క
మాసంపుబత్తెమేర్ప జేసి యీక.
ఆర్తుని బొడగన్న నరుగఁ డాయన యొక్క
అడుగేని యాతని నరసికొనక.
అన్నదాత, విద్వదాదృతిశీలుండు,
అర్థికల్పశాఖి, ఆర్తిహరుఁడు,
అట్టిపూర్ణయాఖ్యుఁ డప్పట్లఁ జుట్టాల
కన్న నెక్కుడగుచు గౌరవించె.

అస్మద్విషయమునఁ గామయ్య యట్లుండినను నస్మద్భ్రాత యప్పయ్యయెడల మాత్రము భయభక్తులతోఁ బ్రవర్తిలెడివాఁడు. అప్రవర్తిలుటలోనే యన్న సుబ్బయ్యకుఁ దెలియకుండ స్వార్జితములోని షట్శతరౌప్యము లల్లుఁడు మామకిచ్చుటయు నవిపెట్టి యాయన యస్మద్గ్రామములోని మాగాణికానున్న మంచిభూమి 4 ఎకరములు కొని పెట్టుటయు నైనయది. అయ్యది యియ్యెడ నబ్దమబ్దము 5, 6 పుట్లవడ్లు పండుచు 2, 3 వేలరూపాయల వెలగలదిగా నుండుచున్నది. కామయ్యకుటుంబమునకు ఘనజీవనమై క్రాలుచున్నది. అట్లు మాయన్నతో నంతరంగము కలిపివర్తించుచు నన్నుఁ జిన్నచూపునఁ జూచుకామయ్యతోఁ గలసిమెలసియుండవలెనని కమ్మలు వ్రాసివ్రాసి ప్రత్యుత్తరము వడయలేక వదవడి యిట్లువ్రాసితిని.